ఓమ్

శ్రియైనమః

# అర్చావతార ప్రభావము

(పద్య కావ్యము)








రచయిత

"ఆగమాచార్య, భిషగ్రత్న, కవీశ్వర, పౌరాణికశేఖర"

**శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులు**

బాపట్ల



ప్రకాశకులు

గౌతమసోదరులు

నల్లూరి వేంకటరంగాచార్యులు – వేంకట సీతారామాచార్యులు

బాపట్ల

ప్రమాది **1973** శ్రావణ పూర్ణిమ

సర్వస్వామ్యములు ప్రకాశకులవి
ప్రతులు-వెయ్యి

వెల : రు ౧-౦౦





గజరాజ రక్షకులైన శ్రీ భావనారాయణస్వామివారు

క్షీరవృక్షము (పాలచెట్టు) నుండి

శ్రీ క్రిమికంఠచోళభూపాలునకు దర్శనమిచ్చుట.

శా॥ శ॥ 515 ఆలయ ప్రతిష్ఠోత్సవము క్రీ॥ శ॥ 594

ప్రమాదీచ నామ సంవత్సర ఫాల్గుణ శుద్ధ పూర్ణిమ

ఆ ది వా ర ము

# జగజ్జనని



వైకుంఠనాథ దయితాం కలశాబ్ధికన్యాం
వాణ్యాది దేవవనితార్చితపాద పీఠాం
వైకుంఠవాసరసికాం వరదాన శీలాం
లక్ష్మీమశేష జగతాం జననీం ప్రపద్యే॥

గ్రంథకర్త - వారి సతీమణి

( ప్రకాశకుల పితామహులు )





శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులుగారు  శ్రీమతి రత్నమ్మగారు

1852 - 1928

బాపట్ల

---

పరమ పూజనీయ భావదేవామల
చరణ కమలసేవ సలపి వాణి
కరుణగాంచిమించి కావ్యామృతము ప్రజా
వళికి బంచె నీ భిషగ్వరుండు.

గ్రంథకర్తగారి కుమారుడు - కోడలు

( ప్రకాశకుల పితరులు )





శ్రీమాన్ నల్లూరి వేంకట్రామాచార్యులుగారు — శ్రీమతి రాఘవమ్మగారు

1882 - 1956

బాపట్ల

---

ప్రథితకృషియొనర్చి వైఖానసాన్వయ
ధర్మ మార్గములను తరచి యిష్ట
దైవమైన భావదేవుని సేవించి
మాన్యుడైన యట్టి ధన్యజీవి.

# మా మా ట

శ్రీ వైఖానసాగమానుసారముగ భగవదర్చన కొనసాగింపబడెడి దివ్యదేవాలయములలో (బాపట్ల) శ్రీ భావదేవ క్షేత్రము గణనీయమైనదైయున్నది. ఈ స్వామివారిని గురించియు - భావపురిని గురించియు - భావపురిలోగల వివిధములైన యాధ్యాత్మిక సంస్థల గురించియు బాపట్ల శ్రీ భావనారాయణస్వామి క్షేత్రమాహాత్మ్యమనెడి పేర నొక గ్రంథమును, శ్రీ భావదేవసుప్రభాతమును లోగడ మేమే ప్రచురించియున్నాము.

ప్రస్తుతము మా పితామహులచే మధురశైలిలో రచించి ప్రచురింపబడిన శ్రీ మదర్చావతార ప్రభావకావ్యమును పునర్ముద్రణ మొనర్ప సంకల్పించితిమి. కాలమాన పరిస్థితులనుబట్టి ముద్రణ విషయమొక గడ్డుసమస్యయైనది. మార్గాన్వేషణ మొనర్చుచుండ శ్రీ భావదేవుడే యొకత్రోవ జూపించెను

21-2-1973 వ తేదీకి సరియగు స్వస్తి శ్రీ పరీధావి సంవత్సర మాఘ బహుళ చతుర్థి బుధవారము చిత్తా నక్షత్ర యుక్త మేషలగ్నమున బ్రాహ్మణసిరిపూడిలో శ్రీ సీతారామ స్వామివారి ఆలయములో జరుప నిర్ణయింపబడిన ధ్వజప్రతిష్ఠ- శ్రీ ఆంజనేయస్వామివారి పునఃప్రతిష్ఠలకు మా సోదరుల నిరువురను కార్యకర్తలాహ్వానించినారు. ఆ యాహ్వానమే గ్రంథముద్రణకు బాటయగుటొక మహాశ్చర్యకర విషయము.

బ్రాహ్మణసిరిపూడి గ్రామములో శ్రీ సీతారామస్వామి దేవాలయమును లోహిత సగోత్రోద్భవులైన శ్రీ మద్దాలి శాస్త్రులు - లక్ష్మీనరసమ్మ దంపతులు 1916 సం॥లో నిర్మించి

యున్నారు. భారద్వాజ సగోత్రోద్భవులైన శ్రీ కొమరవోలు వెంకట్రామయ్య - మంగమ్మ దంపతులు 1950 సం॥లో జీర్ణోద్ధారణచేయగా రెండు పురుషాంతరములపిమ్మట శ్రీమద్దాలి శాస్త్రులుగారి దౌహిత్రులు - దత్తపుత్రులునగు శ్రీకృష్ణమూర్తిగారు, వారిధర్మపత్ని - సత్యప్రసూనాంబగారలు అచ్చట నూత్నధ్వజప్రతిష్ఠకును - శ్రీఆంజనేయస్వామివారి పునః ప్రతిష్ఠకును శ్రద్ధాభక్తులతో పూనుకొని దీక్షాకంకణమును ధరించిరి. వారి సంకల్పబలమున శ్రీ వైఖానసాగమోక్తముగా శతప్రతిష్ఠాచార్యులైన పండిత శ్రీమాన్ దీవి రామాచార్యుల వారి ఆధ్వర్యములో నా ప్రతిష్ఠాకలాపమంతయు జయప్రదముగ నిర్వహింపబడినది.

ఆమహోత్సాహ సమయమున వేదపండిత సన్మానముల గావించుచున్న శ్రీకృష్ణమూర్తిగారిదృష్టికి ఈ గ్రంథముద్రణ విషయమును మేముగొని తెచ్చితిమి. విషయమునంతయు విని వారు మరుమాటాడక ప్రతిష్ఠజరిగిన శుభసమయమునకు గుర్తుగ గ్రంథముద్రణ మొనర్ప సమ్మతించినారు. శ్రీ భావదేవుని కృపవలనను, శ్రీ కృష్ణమూర్తిగారి సహకారమువలనను శ్రీ మదర్చావతార ప్రభావకావ్యము ముద్రింపబడినది.

సహృదయులు సరసులునగు పలువురు పెద్దలు మా ప్రయత్నము నాశీర్వదించుచు, నభినందించుచు వారివారి యమూల్యాభిప్రాయముల నొసగిరి. అందరకు మా అభినందనము లందించుచు శ్రీ భావనారాయణస్వామివారికీకృతిని సమర్పించుచున్నాము.

ఇట్లు
ప్రకాశకులు.

శ్రీ సీతారామస్వామివారి దేవాలయ ధ్వజప్రతిష్ఠాదుల
సందర్భమున ఋత్విక్కులతో
శ్రీ మద్దాలి కృష్ణమూర్తి దంపతులు. 21–2–73



కూర్చున్నవారు కుడినుండి ఎడమకు :

1. శ్రీ నల్లూరి వేంకటరంగాచార్యులు–బాపట్ల 2. శ్రీ మేడూరి రామచంద్రాచార్యులు–వేమూరు 3. శ్రీ పరాశరం గోపీనాథాచార్యులు–చేబ్రోలు 4. నల్లూరి వెంకట్రాయదీక్షితులు–బాపట్ల 5. శ్రీ నారాయణం రఘునాథచక్రవర్తిభట్టాచార్యులు–ఖాజీపాలెం.

నిల్చున్నవారు మొదటివరుస : 1. శ్రీ దీవి సీతారామాచార్యులు–గొడవఱ్ఱు 2. శ్రీ పెద్దింటి వరదాచార్యులు (అర్చకులు) – ఆరుంబాక 3. శ్రీ నల్లూరి వెంకటసీతారామాచార్యులు–బాపట్ల 4. నల్లూరి పాంచజన్యం–బాపట్ల 5. శ్రీ దీవి రామాచార్యులుగారు(అధ్వర్యులు)ముట్లూరు 6.నల్లూరి మోహనరంగాచార్యులు–బాపట్ల 7. శ్రీ పరాశరం వెంకట్రామాచార్యులు–చేబ్రోలు 8. దీవి శ్రీమన్నారాయణాచార్యులు–పటిచెఱుకూరు 9. శ్రీ నల్లూరి వెంకటసుదర్శనజ్వాలానరసింహాచార్యులు–బాపట్ల 10. శ్రీ రొంపిచర్ల శ్రీనివాసాచార్యులుగారు–పాతరెడ్డిపాలెం.

రెండవ వరుస: శ్రీ మద్దాలి కృష్ణమూర్తిగారు, శ్రీమతి సత్యప్రసూనాంబ–
దంపతులు–బాపట్ల (యజమానులు)



శ్రీ మద్దాలి శాస్త్రులు–లక్ష్మీనరసమ్మ దంపతులచే
1916 సం॥లో ప్రతిష్ఠింపబడిన
శ్రీ సీతారామస్వామివారు–బ్రాహ్మణసిరిపూడి.



శ్రీ కొమరవోలు వెంకట్రామయ్య–మంగమ్మ దంపతులచే
1950 సం॥ పునరుద్ధరణగావింపబడిన ఆలయము.
21–2–73 న ప్రతిష్ఠించబడిన నూత్నధ్వజము.

# భక్తజనకల్పకము

వేదాగమోద్ధారక

శ్రీ కొండపల్లి వాసుదేవరావు

బి.ఎ.ఎల్.ఎల్.బి, ఐ.ఎ.ఎస్.

కమీషనర్ - ఎండోమెంట్సు (ఆం.ప్ర.)

హైదరాబాదు - 1

శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులవారిచే రచింపబడిన "శ్రీమదర్చావతార ప్రభావము" అను గ్రంథమును ఆమూలాగ్రముగ చదివితిని. ఇది సులభశైలిలో ప్రబంధముగా విరచింపబడినది. ప్రబంధ లక్షణములన్నియు ఉత్తమరీతిలో శోభించుచున్నవి. శ్రీవిఖనసమహర్షిచే ప్రపంచమున కంద జేయబడిన అర్చావిధానములు సుగమముగా విస్తరింపబడినవి.

ఈ ప్రబంధము అర్చావతార విశేషమును వస్తువుగా జేసి విపులముగా వ్రాయబడినది. పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చ, అను పంచవిధముల మోక్షప్రాప్తి సామగ్రిలో తురీయము "అర్చ". కలికాలమందు సులభముగా ప్రాప్తించు అర్చావతార ప్రభావము భక్తజన బృందమునకు కల్పకమువంటిది. ఈ పుస్తకము భావసౌరభముచే గుబాళించుచు సర్వజనసామాన్యమై అందరికిని అందుబాటులోనుండి, పురాణగాథలతో నిండి అత్యంతరమణీయముగ నున్నది. ఈ పుస్తకమును భక్తులెల్లరు చదివి ఆనందించెదరని ఆశిస్తున్నాను.

శ్రీ భాసదేవుడు ప్రకాశకులకు, ఆయురారోగ్యము లొసంగి ఇంకయూ కొన్ని రచనలను ప్రపంచమున కందజేయగలవని ప్రార్థిస్తున్నాను.

---



అత్రిః భృగుః శ్రీవిఖనాః మరీచిః కశ్యపః

( శ్రీ భావనారాయణస్వామివారి దేవస్థానము - బాపట్ల )

భృగ్వత్రికశ్యప మరీచిమహర్షిమధ్యే
స్థిత్వాసనే సవశమనే సముదీరయన్తమ్
శాస్త్రసారమఖిలం విఖనోమునీన్ద్రమ్
ధ్యాయామి భువనైక గురుం ప్రసన్నమ్॥

శ్రవణే శ్రావణే శుక్లపూర్ణిమా సోమవాసరే
సింహలగ్నేచ సంయుక్తే భవేనైమి శమాగతమ్॥

నిరుపమగుణ పూరమ్ నిత్యసత్యప్రచారమ్
నతజనమునివారమ్ నౌమితత్త్వార్థసారమ్
కలుషనగమహేన్ద్రమ్ కామితార్థైక కేన్ద్రమ్
విఖనసముని చన్ద్రమ్ దివ్యభవ్యాబ్ధిసాన్ద్రమ్॥

లక్ష్మీపల్లవ సంకల్ప వల్లభాయమహాత్మనే
శ్రీమద్విఖనసేతుభ్యమ్ మునివర్యాయ మఙ్గళమ్॥

---

# సత్కార్యము

శ్రీ కె. వి. నరసింహమూర్తి
బి.ఎ.ఎల్.ఎల్.బి.
డిప్యూటీ కమీషనరు - ఎండోమెంట్సు
విజయవాడ - 2

శ్రీ బాపట్ల భావనారాయణస్వామివారి వంశపారంపర్యార్చకులలో నొకరగు శ్రీమాన్ నల్లూరి రంగాచార్యుల వారు రచించిన 'అర్చావతార పరిభావమును' చదివి యానందించితిని.

ఇది శ్రీ వైఖానసాగమ విశేషములను - శ్రీ విఖనస మహర్షి మహోదయమును వర్ణించుచున్న కావ్యము. సరస శైలిలో గల ఈ గ్రంథము డెబ్బదియేండ్ల క్రిందట 'ముద్రింపబడినది.

దీని అవసరమును గుర్తించి గ్రంథకర్తగారి పౌత్రులగు గౌతమసోదరులు పునర్ముద్రణ చేయబూనుకొనుట ముదావహమైన విషయము. ఇట్టి కావ్యములు ప్రచురింప బడుటవలన యెన్నియో క్రొత్త విషయములు వెలువడును. గౌతమ సోదరులొనర్చిన యీ సత్కార్యము నిజముగ అభినందనీయము.

శ్రీ భావదేవుడు ఇట్టి గ్రంథములనేకము వెలుగునకు తెచ్చి భక్తజనమనోరథముల ఫలింపజేయుగాక యని మనసారా కాంక్షించుచున్నాడను.





శ్రీ రాజ్యలక్ష్మీ తాయారు - శ్రీ భావనారాయణస్వామి





శ్రీ స్వామివారి పాదపద్మారాధకులు - ప్రకాశకులు - గౌతమసోదరులు

(గ్రంథకర్తగారి పౌత్రులు)

నల్లూరి వేంకటరంగాచార్యులు - వేంకటసీతారామాచార్యులు

బాపట్ల

ఓమ్ శ్రియైనమః

# ప రి చ య ము

చతుశ్శాస్త్ర మహావిద్వాన్, కులపతి, న్యాయరత్నాకర

## శ్రీమాన్ పణ్డిత వేదాన్తం జగన్నాథాచార్యః

ఆస్థాన విద్వాన్ తిరుమల తిరుపతి దేవస్థానములు

(అప్పికట్ల) తిరుమల

13-8-1973 ప్రమాది శ్రావణి.

శ్రీ వైఖానసకుల తిలకుడగు నీ గ్రంథకర్త పణ్డిత రంగాచార్యులవారు దేవయజనదక్షులు; పౌరాణిక శేఖరులు వైద్య విధాన నిష్ణాతలు, కర్మనిష్ఠాగరిష్ఠులు, అయియున్నారు.

క్షీరార్ణవమున నాగపర్యంకమును వీడి భావపురమున క్షీరతరుమూలము నందర్చావతారమున, యావిర్భవించిన శ్రీ మన్నారాయణుని పరమవైదిక విధానముచే నారాధించిన వీరు కవితా ధురంధరులై కృతజ్ఞతా ప్రకాశనమోయన నీ యర్చావతార ప్రభావమును శ్రీ రంగాచార్యులవారు సర్వమానవ సౌలభ్యముగ నాంధ్ర భాషలో రచించి ధన్యతను సంపాదించుకొని యున్నారు.

అఖిల జగదుద్భవస్థితిలయ లీలా వినోదియగు శ్రీమన్నారాయణుడు దయాసముద్రుడగుటచే పరత్వమును వీడకనే సర్వచేతన రక్షణార్థమై సౌలభ్యముగ నర్చావతారమున, వేంచేసి యున్నారని వేదశాస్త్రములు, విజయధ్వానములు చేయుచున్నవి.

ఉపనిషత్తులు "మాతాపితా భ్రాతా నివాసశ్శరణం సుహృద్గతిర్నారాయణః" అని శ్రీమన్నారాయణునియందు

పరిబోధించు మాతృత్వ పితృత్వాది సర్వవిధ బంధుత్వములు సర్వవిధ చేతనులకుకూడా అర్చావతారమునందనుభవించతగి యున్నవియని స్పష్టీకరించు చున్నవి.

"స్వత్వ మాత్మని సంజాతం స్వామిత్వం బ్రహ్మణి స్థితం" ఇతి. చేతనునియందు స్వత్వము, పరబ్రహ్మయగు శ్రీమన్నారాయణునియందు స్వామిత్వము, సహజ ధర్మములు అని ప్రమాణములు పరిబోధించుచుండ మద్గ్రామవాసీ భగవాన్ 'మమాయం రామః" "మమాయం కృష్ణః" అని దేవునియందు స్వత్వమును, తనయందు స్వామిత్వమును– అటులనే రామకృష్ణాదులయందు స్వత్వమును తమయందు స్వామిత్వమును తెలియజేయునట్టి అజ్ఞానులయొక్కయు, విజ్ఞానులయొక్కయు స్వత్వ స్వామిత్వ వ్యత్యయ సంలాపములను, ఇయత్తావిధురమగు ప్రేమవాత్సల్యాతిరేకములచే పితృపుత్ర న్యాయముగా నానందించు, అవతారము అర్చావతారము. (సప్తాచలమున చూడుము).

భగవద్గుణానుభోక్తలగు మహర్షులు మందాధికారుల యొక్క సౌలభ్య సౌశీల్యాద్యనుభవ సంజనితానంద పరంపరల సాక్షాత్కరించుకొని భగవదవతారములలో నీయవతారము పరమశ్రేష్ఠమని వాకొనుచున్నారు.

దేశనియమము, కాలనియమము, అధికారనియమము లేక ఆహార విహారాది వ్యాపారములకుకూడా ఆరాధక పరాధీనుడై అపరాధములను పాటించక సర్వసహిష్ణువై బింబ సాన్నిధ్యమునుపొంది సర్వాభీష్ట పరిదాతయై చేతనులచు

రక్షించు నవతారమగు నీయర్చావతారము పరమశ్రేష్ఠము అని చెప్పుటలో వేదములకు, శాస్త్రములకు, మహర్షులకు పక్షపాతమించుకంతయు లేదని దృఢముగా చెప్పతగియున్నది. (సప్తాచలమున చూడుము).

సర్వవిధముల పరత్వమునను భవించు నీ యర్చావతార మును గూర్చి నతిసులభశైలిలో నీ యాచార్యులవారిచే రచింపబడిన ఈ యర్చావతార పరిభావము పాఠక చేతన లోకమునకు పరత్వ సౌలభ్యములచే ప్రకాశించు పరమేశ్వరునివలె ఉత్తరోత్తరము ఆనంద పరంపరల నందించుచు ("అర్చావతార-స్సర్వేషాం బాంధవో భక్తవత్సలః" ఇత్యాదిగా శాస్త్రములు విశదీకరించు చున్నవి.) ఇక్షురసన్యాయముగా మధురాతి మధురమై వర్ధిల్లుగాక.

—o—

శ్రీరార్ణవే ఫణిపతౌ శయితస్త్వమత్ర
శ్రీరద్రుమేచ వసతిం బహుమన్యమానః
శ్రీరోదజాసహచరస్సకలాన్ త్వదీయాన్
సంరక్షితుం వససి కేశవ భూపదేవ.



శ్రీ భావదేవాయనమః శ్రీమతే వైఖనసేనమః

# అనుమోదము

రాష్ట్రపతి బహుమతి గ్రహీతలు
వైయాకరణ పంచానన ఆగమాచార్య - విద్వత్సార్వభౌమ
శ్రీమాన్ పణ్డిత రొంపిచర్ల పార్థసారధి భట్టాచార్యులు
తిరుమల

మూడు ఆశ్వాసములుకల "అర్చావతార ప్రభావము" అను చిన్న పుస్తకము చదివి చూచినాను. బాపట్ల భావదేవునిసన్నిధి పురాణస్థలముగా తెలియుచున్నది. శ్రీవారి అర్చకులు అప్పటినుంచి శ్రీ వైఖానస సూత్రము వారనిన్ని అర్చకకుటుంబమువారు పారంపర్యముగ నేటికిని విద్వాంసులు, కవులు అనియు ప్రశంసింపబడుచున్నారు. గ్రంథకర్త యొక్క రచనాశైలి మనోహరముగా నున్నది. ఈ ప్రచురణము ద్వితీయ ముద్రణము అగుటచే దీనియందుగల అభిరుచి నిర్ణయింపబడగలదు. గ్రంథకర్త తనరచన స్వతంత్ర కల్పనముకాక పురాణోద్ధృత చరిత్ర మూలకమని చెప్పుటచే వారి ప్రామాణికత్వము తెలియుచున్నది. బాపట్లలో వేంచేసియున్న శ్రీ గరుత్మంతునకు సంప్రదాయముగ జరుపబడుచు వచ్చుచున్న గరుడాష్టోత్తర శతనామస్తోత్ర మిందు చేర్చబడినది. ఇది ప్రతముద్రణము కంటె ఆదరణీయ విషయము. భక్తులందరు దైనందిన పారాయణ పుస్తకముగ కూడ దీనిని వినియోగించుకొనుటకు అనుకూలముగ నున్నది. శ్రీ భావదేవుని కృపచే ఈ పుస్తకము భక్తజనమున కామోదము నీయగలదని ఆశించుచున్నాను. గ్రంథ ప్రకాశకులు నాకీ నాల్గు మాటలు వ్రాయుట కవకాశము నిచ్చినందులకు వారికి నా కృతజ్ఞతను నివేదించుచున్నాను.

—o—

# ఆ న ం ద ము

శ్రీ దేవిరెడ్డి నందగోపాలరెడ్డి
అసిస్టెంటు కమీషనరు
హిందూ దేవాదాయ ధర్మాదాయ శాఖ
బా ప ట్ల

శ్రీ రాజ్యలక్ష్మీ సమేత శ్రీ భావనారాయణస్వామి వారు బాపట్ల పట్టణవాసులకే కాక యావదాంధ్రులకు - ఇష్ట దైవము. ఈ స్వామివారికి జరిగెడి బ్రహ్మోత్సవము - కన్నుల పండుగజేసి యీ క్షేత్రప్రశస్తిని వేయినోళ్ళచాటుచుండును.

శ్రీ స్వామి వారి - అర్చక బృందమున నొకరగు శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులగారిచే సుమారొక 70 సంవత్సరముల క్రిందట రచింపబడిన ఆంధ్ర పద్యకావ్యమే శ్రీ మదర్చావతార ప్రభావము.

శ్రీ రంగాచార్యులగారు నైష్ఠికధర్మముల నాచరణలో బెట్టుచు భగవదర్చన గావించి తరించిన - ఉత్తమపండితులని వారి వంశక్రమ పరంపరనుబట్టి తెలియుచున్నది. దైవాను గ్రహబలమున వారికి ఆ గ మ శా స్త్ర విజ్ఞానముతో బాటు కవితా ప్రజ్ఞయు లభ్యపడుట మఱొక విశేషము.

కవితాశక్తిని - భగవంతుని మహిమలను అర్చావతార విశిష్టతను అర్చనారీతిని బ్రహ్మోత్స విశేషములను వివరించుట కొరకే యీ మహనీయుడు వినియోగపరచుకొని ధన్యుడగుట మరియొక మహావిశేషము. ఆ పూజ్యుని పవిత్రదృష్టి ప్రశంసనీయమైనట్టిది.

ఈ కావ్యమున శ్రీ వైఖానస సూత్రకర్తయగు విఖనసాచార్యులవారి ప్రాదుర్భావము వైఖానసాగమ విశిష్టత యును విశదీకరింపబడియున్నవి.

అనాదిగా వైఖానసాగమ సూత్రానుసారముగ - అర్చనలందుకొనుచున్న భావదేవుని అర్చక పరంపరలోని వారును గ్రంథకర్తయొక్క పౌత్రులును గౌతమసోదరులునగు శ్రీమాన్ నల్లూరి వేంకట రంగాచార్య - వేంకట సీతా రామాచార్యులు - గారలు ఈ కావ్యపునర్ముద్రణమునకు బూనుకొనుట ముదావహ విషయము.

ఇట్టి పవిత్రకావ్యము పునర్ముద్రణ భాగ్యమునందు చున్న తరుణమున - ప్రాంతీయ దేవాదాయ ధర్మాదాయ శాఖాధికారిగా నేనుండుట నా సుకృత విశేషమని యెంచు చున్నాను.

ఈ సందర్భమున నాకుగల్గిన యానందము నిట్లు వెలువ రించుకొనుటకు సదవకాశమును గలుగజేసిన ప్రకాశకులకు నా ధన్యవాదములు.

శ్రీ భావదేవుని కృపవలన యిట్టి ప్రాచీన గ్రంథము లెన్నియో వెలుగునకు రావలయునని నేను నిండుమనస్సుతో కాంక్షించుచున్నాను.

—o—

క్షీరవృక్షేన తీర్ణాయ క్షీరసాగరశాయినే
రాజ్యలక్ష్మీ సమేతాయ భావదేవాయమఙ్గళమ్॥

# ఆ మో ద ము

అభినవపోతన "భగవత్కవిశేఖర"

శ్రీమాన్ నరహరిగోపాలాచార్యులు, తమ్మర.

"శ్రీ మదర్చావతార ప్రభావము" అనెడి మూడాశ్వాసముల గ్రంథము నాపాదచూడము సేవించితిని.

భూషణములు చెవులకు బుధ
తోషణములనేక జన్మదురితౌఘవిని
శ్శోషణములు మంగళేతర
ఘోషణములుగరుడగమనుగుణభాషణముల్॥

అని బమ్మెరపోతరాజుగారు నుడివినట్లు భగవద్గుణ విశేషణ నిరూపణ రచనాంచితమగు నీగ్రంథము పరమపవిత్రమైనది. దీనియందు శ్రీహరి యర్చావతార విధానాఽగమ శాస్త్ర నిర్మాతయగు శ్రీ విఖనోమహర్షి యవతార వృత్తాంతంబును, అర్చావిధానంబును తద్భక్తియు నుత్సవవిశేషంబులును, తత్ఫలంబును బహ్మాండాంతర్గతంబులగు కథావిధానంబులును పొందుపఱచబడియున్నవి. విశేషములు విశేషజ్ఞులెరింగి సంతసింతురని నమ్ముచున్నాను.

ఈ గ్రంథాంతమందు పైగ్రంథకరగారి పౌత్రులు శ్రీమాన్ నల్లూరి వేంకటరంగాచార్యులవారు సమకూర్చిన శ్రీ గరుడాష్టోత్తర శతనామస్తోత్రము, నామావళియు జేర్చుట మిగుల శ్లాఘ్యమై యున్నది. ఈ గ్రంథముల బ్రకాశింపజేసి భక్తపాఠకలోకమునకందించిన ధన్యులకు ధ న్య వా ద ము

లర్పించుచు కృతికర్తలు కీర్తిశేషులునగు శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులవారిని పద్యచతుష్టయముతో ప్రశంసించి ముగించుచున్నాను.

శ్రీమద్విద్వత్కవి
ధామా ! నల్లూరి రంగధామాఖ్యా ! సుధీ
భూమానందా! త్వత్కృతి
లో మాధుర్యంబు విజ్ఞలోకము మెచ్చున్॥

పోతనశైలిలోనిమధువున్ మఱినన్నయముఖ్యసత్కవి
వ్రాతములోని దార్ఢ్యతయు బద్యములందున నచ్చటచ్చటన్
స్ఫీతముగాగనంబడెడి శ్రీతరుణీశకృపారసస్ఫుట
శ్రీతనువొందినట్టికృతి శిష్టులు మెచ్చి నుతించునట్లుగన్॥

రంగచ్ఛ్రీసువికుంఠలోకమున శ్రీరంగేశువాస్థానమం
దంగీకారమునొంది కావ్యరచనాహ్లాదంబు గావింప
శ్రీరంగాచార్యసుధీమణీయరిగినారా ! శ్రీవికుంఠంబహో
రంగా మీకృతి మీస్వరూపమయిసంరక్షించెడిన్ భక్తులన్॥

శ్రీమద్భావపురీనివాసుడగు లక్ష్మీనాథునర్చించి త
ద్ధామంబందితరించినారు మనుత్వత్పాందాంబుజచ్ఛాయలం
దేమమ్మున్నడిపించ శ్రీవిభునకెంతే విన్నవింపన్వలెన్
దామీదీనులకోసమై యచట విద్వద్రాజచూడామణీ॥



## Sri D. Vighanasacharyulu,

*Asst. Engineer,*
T. T. Devasthanams
**TIRUPATI**

I have the opportunity of reading the "Archavatara Prabhava" book in Telugu, written by late Sri Rangacharya of Bapatla. This explains in simple language about glory of Idol worship according to Vaikhanasa Agama.

The ambition of human soul is "Mukti" or liberation from the birth and death cycle. This emancipation of soul is explained in Vedanta Sastra. The Philosophy of Vedanta is enshrined in the Upanishads, the Gita and the Brahma Sutras, which are together called Prasthanatraya.

The Prasthanatraya says, the Brahman is spiritually realizable by moral and spiritual discipline. Moral discipline is explained in Karama yoga, and spiritual discipline in Jnana Yoga. These Karma and Jnana Yogas are means to Mukti only through Bhakti Yoga.

In Bhakti Yoga the worship of God is in four ways i.e. Japa, Homa, Archana and Dhyana. Out of the four the Archana is the best and easy in Kaliyuga. The present book Archavatara Prabhava, explains this.

May the Lord Venkateswara of Seven Hills shower His choicest blessings on the publishers of this book.

## శుభాకాంక్ష

ఉపన్యాసమహోదధి

శ్రీమాన్ పణ్డిత నారాయణం రఘునాథ చక్రవర్తి

భట్టాచార్యులు, ఖాజీపాలెం.

శ్రియఃపతియై శ్రీ వైకుంఠ నికేతనుడైన శ్రీమన్నారాయణుడు స్వాశ్రితజన సంరక్షణార్థియై - అనేక దివ్యావతారముల ననుగ్రహించి సహృదయ శిష్టజనరక్షణంబును దుర్హృదయ దుష్టజన శిక్షణంబును గావించి లోకంబున తన దివ్యమహిమలజాటెను.

తదనన్తరము సౌలభ్యగుణ ప్రకాశనార్థమై దేవతిర్యఙ్మనుష్యాత్మకంబైన జీవసమూహమున సజాతీయత ప్రకటించుచు - వ్యూహవిభవావతారంబుల నవతరించి యెల్లరచే నారాధితుండగుచు శ్రీ స్వామి భక్తజనుల ననుగ్రహించుచున్నాడు. పిమ్మట శిలా, లోహా, మృద్దారుమయమైన అచేతన సజాతీయమగు అర్చారూపుడై స్వయంవ్యక్తుడై ఆరాధక లోకసమారాధనీయుడై బదరీక్షేత్రమున నారాయణమూర్తిగ, వేంకటాద్రిని శ్రీనివాసమూర్తిగ పలుదివ్యదేశముల వరదరాజ రంగేశ్వరాది రూపములలో నవతరించి సర్వకాలముల సేవలంగొనుచు శ్రియఃపతి భక్తులను తరింపజేయుచుండెను.

కీర్తిశేషులయిన శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులవారి రచన శ్రీమదర్చావతార ప్రభావము. వారు నల్లూరి వంశ

పయఃపారావార రాకాసుధాకరులు. శ్రీ భావనారాయణ కృపాసమాసాదిత సరసకవితాధురంధరులు.

భావపట్టమునస్వయంవ్యక్తులైన శ్రీ భావనారాయణ స్వామివారు భక్తకల్పద్రుమము. సద్యఃప్రవాహిత కృపాసింధువు. సర్వకామదాన మహితాభయకరకమలశోభితుడు. శ్రీరామ నారసింహ కేశవ రాజ్యలక్ష్మీ విఖనసాచార్య, రంగనాయక గోదాదేవి పరివృతుడు. శ్రీవైనతేయ, హనుమద్యతిరాజ ప్రపన్నగణ పరిసేవితుడు.

శ్రీమాన్ నల్లూరి రంగాచార్యస్వామివారు రచించిన అర్చావతార ప్రభావము. మహాకావ్యలక్షణ లక్షితమై యున్నది. శ్రీ విఖనసాచార్య ప్రాదుర్భావముతో పాటుగా అర్చావతార వైభవమునుగూడ వ్యస్తముగా సమస్తముగా ప్రవచించుటలో వీరి రచన మిన్నందినది. సందర్భోచితవర్ణనా వైచిత్రితో కావ్యత్వముకమిచికొన్నది.

ఈ గ్రంథమును పునర్ముద్రణ మొనర్చి లోకమున కందించెడి మహాభాగ్యము శ్రీ ఆచార్యస్వామివారి పౌత్రులగు శ్రీమాన్ వెంకట రంగాచార్య, వెంకట సీతారామాచార్య సోదరులకే దక్కుటొక మహాభాగ్యము.

ఈ దివ్య ముద్రణ కార్యమును సభక్తికముగా నిర్వహించిన గౌతమ సోదరుల కృషి ప్రశంసనీయము. వీరికి శ్రీ భావదేవుడు ఆయురారోగ్యైశ్వర్య భోగభాగ్యములను ప్రసాదించవలెనని కాంక్షించుచున్నాను.

తథాస్తు

శ్రీ భావనారాయణస్వామినేనమః

# అ భి న ం ద న

కవికథకరత్న, హరికథాసుధాకర, కథాగాన కళాప్రపూర్ణ

శ్రీమాన్ పణ్డిత పెద్దింటి సూర్యనారాయణదీక్షితదాసు

న ర్సా పు ర ము.

శ్రీ చిత్తాబ్జమిళిందమూర్తి, త్రిజగత్ క్షేమంకరుం, డాగమ
ప్రాచుర్యార్థ సుసంప్రదాయ విహితార్చావైభవస్ఫూర్తి లీ
లాచాతుర్యవినోదభాసుర సముల్లాసుండు నల్లారి రం
గాచార్యోత్తమకావ్య, మక్షరయశంబందన్ గటాక్షించుతన్॥

* * *

కమనీయప్రవణప్రపత్తి విలసత్కల్పంబనన్ దోచి భ
వ్యమనీషా సుషమాప్రదీప్తమగు శ్రీ అర్చావతారప్రభా
వమనోజ్ఞోత్తమ పారలౌకికకృతివ్యాసంగ మాముష్యల
బ్ధి, మనుష్యత్వమునొనగొల్పుతసుతృప్తిన్ మాధవత్వప్రభన్॥

* * *

గరుడాష్టోత్తర శతనా
మరుచిన్ భవఘోరవ్యాజనమరుదశనంబుల్
సిరియుంబుజెంద మోక్షం
బరిశిన్ లభియింపకున్నె ఆస్తికతతికిన్ ?



శ్రీనివాస పరబ్రహ్మణేనమః

# మానసోల్లాస నివేదనము

"విద్వత్కవిశేఖర"

శ్రీమాన్ పణ్డిత నారాయణం రామానుజాచార్యులు

సాహితీసదనము - ఉల్లిపాలెం

రేపల్లె తాలూకా, గుంటూరుజిల్లా.

శ్రీ మదుభయవేదాన్త ప్రవర్తకులును, శ్రీవైఖానస శ్రౌతస్మార్త భగవచ్ఛాస్త్రక్రియాప్రయోగ నిష్ణాతలును ఆయుర్వేదవిద్వద్వరేణ్యులును, మహాకవిజనమానసీయ ప్రతిభా సంపన్నులును, శ్రీ వైఖానసకులతిలకాయమానులును, యశః కాయులునగు శ్రీమాన్ పణ్డిత నల్లూరి రంగాచార్యస్వామివారు రచించిన "శ్రీ మదర్చావతారప్రభావము" అను నీగ్రంథ రాజమునామూలాగ్రముగా దిలకించి చక్షుష్మత్వమున కను కూలమగు ఫలమును సంపాదించగల్గితిని.

ఆచార్యులవారిచే రచియింపబడిన సంస్కృతాంధ్ర గ్రంథ సుమమాలికయందిది మహామోదప్రచురణశీలముగల నొకానొక దివ్యకుసుమము. ఈ గ్రంథపఠనము నాకెంతయో సంతోషదాయకమైవిలసిల్లెను. ఇయ్యది ఆశ్వాసత్రయాత్మకమై యెసలారుచున్న మహోత్తమ ప్రబంధము.

ఇందు ప్రథమాశ్వాసమున సకలజగదాచార్యవర్యులగు శ్రీ మద్విఖనోమునీంద్రుని యావిర్భావము, ద్వితీయాశ్వాసమున భక్తలక్షణము, ఊర్ధ్వపుండ్రలక్షణము, స్వయంవ్యక్త, దైవిక, సైద్ధ, మానుషస్థలభేద నిర్ణయము, భగవత్ప్రతిష్ఠార్చనోత్సవాది ఫలనిర్ణయము. తృతీయాశ్వాసమున, నిత్యకైంకర్య ఫలనిర్ణయము విశదీకరింపబడియుండెను.

మరియు గ్రంథాంతమందు ప్రదక్షిణనిర్ణయము బ్రహ్మోత్సవాహ్నిక సంజ్ఞనుబట్టి వాహనభేదనిర్ణయము భగవదర్చనాఫల నిర్ణయము శ్రీమద్గరుడాష్టోత్తరశతనామ స్తోత్రము నామావళియునుగలిగి బహువిధోపకారకమై యలరారుచుండెను.

భగవత్కైంకర్య మహాత్మ్యము ఇతిహాసోదాహరణ పూర్వకముగానిందు నిబంధించియుండుటవలన నీ గ్రంథము పరమనాస్తికులనుగూడ పరమాస్తికులనుగా నొనర్చుటకు మహాద్భుతశక్తికలిగి విరాజిల్లుచుండెననుట మిథ్యావాదమెంత మాత్రముకానేరదు.

మృదుమధుర రసాప్లుతపదసంఘటనములతో ఆచార్యుల వారి కవితాధార వియద్గంగా ప్రవాహముంబురుడించుచు గ్రంథాంతమువరకు నాకేత్రిరుగా బ్రవహించినది. మరియు విఖనోమునీంద్రుని ప్రాదుర్భావ వృత్తాంతము ఆనందసంహిత మొదలగు సద్గ్రంథములందు భిన్నభిన్నముగనుండినను ఈ గ్రంథకర్తలగు శ్రీ ఆచార్యులవారు కేవలము బ్రహ్మాండ పురాణమునే ఆధారముగాగైకొని పండితపామర జనమనో రంజకమగుశైలితో పరిసమాప్తి గావించియుండిరి.

ఈ యుత్తమగ్రంథమును ద్వితీయముద్రణముగావించి ప్రజానీకమున కందించి మనస్సంతుష్టిని నేత్రోత్సవమును సమకూర్చినట్టి గ్రంథకర్తగారి పౌత్రులను సర్వదారక్షించుచుండెగలందులకై నాయిష్టదైవమగు శ్రీ శ్రీనివాసమూర్తిని ప్రార్థించుచున్నాడను.

# మహోపకారము

"భిషగ్రాజ"

శ్రీమాన్ దీవి వేంకటనరసింహాచార్యులు

సంపాదకులు

శ్రీ వైఖానసభగవచ్ఛాస్త్రగ్రంథమాల, నల్లూరు.

ఉభయవేదాంత ప్రవర్తకులైన శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులవారిచే రచింపబడి మీచే ద్వితీయముద్రణముగా ప్రకటించబడిన శ్రీ మదర్చావతార ప్రభావము అను పద్య కావ్యమును చదివించుకొని విని ఆనందించితిని.

ఈ గ్రంథము వినుచున్నంతసేపు మన తాతగారైన రంగాచార్యులుగారు సాక్షాత్కరించినట్లున్నది. దీనిని ప్రక టించి మీరు సంఘమునకు మహోపకార మొనర్చినారు.

ప్రతి పద్యమునందును శ్రీ భగవచ్ఛాస్త్రమున రచ యితకుగల సర్వతోముఖపాండిత్యము ప్రకటింపబడుచున్నది. ఆగమశాస్త్రసారాంశము సామాన్యులకుగూడ అందుబాటులో నుండునట్లు ఈ పద్యకావ్యమును వారు రచించి మహోపకార మొనరించిరి. వారు పండితులు మహాకవులు. వారు చిరకాల మర్చించి సాక్షాత్కరింపజేసికొన్న విఖనసార్చిత శ్రీ భావదేవుడు మిమ్ము సదా రక్షించుగాక!

"భావపట్టణవాసాయ - భక్తాభీష్టప్రదాయినే
భానుకోటి ప్రకాశాయ - భావదేవాయ మఙ్గళమ్॥
శ్రీ భూమానసచోరాయ - శేషపర్యంకశాయినే
వైఖానసమునిశ్రేష్ఠపూజితాయాస్తు మంగళమ్॥"

—o—

# అనుభూతి

## డాక్టర్: శ్రీ బాపట్ల వెంకటచలపతిరావుగారు

వంశపరంపరాధర్మకర్తలు.

శ్రీ భావనారాయణస్వామివారి దేవస్థానం, బాపట్ల.

శ్రీ మదర్చావతార ప్రభావమును రచించినవారు అమరావతిని పాలించిన శ్రీ రాజా వాసిరెడ్డి వేంకటాద్రిప్రభుని ఆస్థానవైద్య విద్వాంసులగు శ్రీమాన్ నల్లూరి తిరువెంగళాచార్యులవారి పౌత్రులు, పండితులు భిషగ్మణులైన శ్రీమాన్ వేంకటాచార్యులవారి పుత్రులు. వీరు గొప్ప పౌరాణిక శేఖరులు. ఆయుర్వేదవైద్య విశారదులుగూడ.

నేను శ్రీవారి దేవస్థానమునకు ఆనువంశిక ధర్మకర్తగా 1920 సంవత్సరమునుండి నా విధులు నెరవేర్చుచు వచ్చితిని. ఈ గ్రంథకర్తగారైన శ్రీ రంగాచార్యస్వామివారు 1928 వ సంవత్సరమున పరమపదమలంకరించిరి. వీరు నాయందత్యంత వాత్సల్యము చూపెడివారు. అంతటి పండిత శేఖరులు శ్రీవారి ఆరాధకులుగానుండుట నాకును, నాతోటి ధర్మకర్తలకు నెంతయో గర్వకారణముగానుండెడిది. వారొనరించెడి విశేష కైంకర్యములతో వాల్గొని ఆనందించెడివారము. వీరితో డ్పాటు వలన ఆలయాభివృద్ధికూడా చేయగలిగితిమి.

1809 సంవత్సరములో శ్రీ రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడుగారిచే శ్రీవారి సన్నిధిన ప్రతిష్ఠించిన కీర్తిధ్వజమునకు ది 18-12-1922 న తామ్రకవచ సమర్పణము, తరువాత శ్రీవారి వాహనములన్నిటికి పునఃప్రతిష్ఠా కార్యక్రమ నిర్వహణము, వాహనశాల నిర్మాణము, ఆలయప్రాంగణమున

కళ్యాణమంటపమున నాపరాళ్ళను పరిచించుట - పాకశాల నిర్మాణము - ప్రత్యేక కూపనిర్మాణము మున్నగునవి వీరి తోడ్పాటుకు నిదర్శనములు. శ్రీ ఆచార్యులవారు ప్రతినిత్యము స్వామి సన్నిధిన పురాణ కాలక్షేపము చేయుచు శ్రీవారి వైభవాదులనుగూర్చియు, సంప్రదాయములనుగూర్చియు ప్రబోధించెడివారు. వీరీగ్రంథమునేగాక శ్రీ భావనారాయణస్వామి వారి స్థలప్రభావము, శ్రీహరినామ కీర్తనలు, ఎదురుకోల రాయబారము, తిరుమంగయాళ్వారు చరిత్రము మున్నగు వానినిగూడ రచించి శ్రీవారికంకితమొనర్చి ముద్రించి యుంచిరి.

డెబ్బదిసంవత్సరముల క్రిందట ముద్రితమైన ఈ గ్రంథము మృదుమధుర పౌరాణిక శైలిగలదై రసపూరితమై విరాజిల్లు చున్నదనుట అతిశయోక్తి కాదు. మహాకావ్యలక్షణ లక్షితమై యలరారుచు భక్తిప్రపత్తుల కాలవాలమై నాస్తికులను సైతము దయా, సత్యశౌచ ధర్మనిరతులగావించి భగవత్సేవా పూజాదుల యందభిముఖుల గావించుటకీగ్రంథమెంతయో తోడ్పడుచున్నది.

గ్రంథకర్తగారి పౌత్రులైన గౌతమసోదరులు ద్వితీయ ముద్రణగావించుటెంతయో ముదావహము. స్వయంవ్యక్తులైన శ్రీ భావదేవుడందరిపై తన అపారమైన అనుగ్రహ ప్రసాదమును స్రవింపజేయుగాక యని మనసార స్తోత్రమొనరించుచున్నాడను.

"శ్రీ భావదేవచరణౌ శరణం ప్రపద్యే"

# భగవత్సంకల్పము

శ్రీ కర్లపాలెం రామకృష్ణమూర్తి

రిటైర్డు హెడ్మాష్టరు, బాపట్ల.

శ్రీమదర్చావతార ప్రభావమను గ్రంథమును చూచెడి భాగ్యము గల్గినందులకు సంతోషము. శ్రీ రంగాచార్యులగారు మా కుటుంబమునకు చాల సన్నిహితులు. వారు శ్రీ భావనారాయణస్వామి వారి ఆరాధకులేగాక ఆయుర్వేదమున ప్రథమశ్రేణి వహించిన వైద్యశిఖామణులు కూడా. శ్రీ తిరుమల వేంకటేశ్వరస్వామికి కృతినర్పించి తరించిన అన్నమాచార్యులుగారెటులనో! వీరును నట్లే శ్రీ భావనారాయణస్వామివారికి కృతి నర్పించి తరించిన భక్తాగ్రేసరులలో నొకరు.

ఈ గ్రంథము యొక్క కథా ప్రారంభమునందు కవి "బౌద్ధ పాషండమతములు ప్రబలె భువిని" యని వాక్రుచ్చియున్నారు. అనగా అప్పటికే ప్రజలలో విభిన్న బుద్ధులు గల నాస్తిక ప్రచారకులు, పాషండులు ప్రబలియున్నారని విదితమగుచున్నది. బౌద్ధమనగా సాధారణముగా జన బాహుళ్యమున బౌద్ధునిచే స్థాపించిన మతమని తలచుట సహజము. అట్టిది కవి యుద్దేశ్యమైయుండదు. "బుద్ధిః కర్మానుసారిణి" అను నార్యోక్తి ననుసరించి మూఢులైనవారు పరమాత్మని విస్మరించి నాస్తికులై తమ బుద్ధ్యనుసారమే ప్రవర్తించు మతము బౌద్ధమతముగ గ్రహింపదగి యున్నది.

అట్టి నాస్తిక మత విధ్వంసనమొనర్చి ఆస్తికత్వము పెంపొందింప జేసి మనలను తరింపజేయుటకై నారదుడొనర్చిన ప్రియత్నమీ కథాభాగమునద్యోతకమగుచున్నది నాటి నారదుని ప్రియత్న ఫలమే నేడు మనము దిలకించుచున్న అర్చామూర్తుల వైభవము.

భక్తాగ్రేసరులగు శ్రీ రంగాచార్యులగారు ఇప్పటికి షుమారు 70 సంవత్సరములకు క్రిందట రచియించి ప్రథమ ముద్రణ గావించిన ప్రతులు కాలగతినిమఱుగ్గై; నేటికి బౌద్ధ పాషండములు తిరిగి తలఎత్తుచున్న ఈ తరుణమున ఇయ్యది వెలుగునకు వచ్చి ద్వితీయ ముద్రణము గావించబడుట భగవత్సంకల్పము.

భావనాతీతుడగు భావదేవుడు కర్తకు - పరిచరణ కర్తలకు - పోషకులకు - సమారాధకులకు సకలాభీష్టముల నొసగి కాపాడు గాక!!

—o—



# కా వ్య వై భ వ ము

"మధురకవి"

శ్రీమాన్ పణ్డిత బృందావనం రంగాచార్యులు, పరుచూరు.

'శ్రీ మదర్చావతార పరిభావము' మూడాశ్వాసముల మధురకావ్యము. కర్త డెబ్బదియేండ్లు క్రిందటి వ్యక్తి. అయినప్పటికిని కవిత యత్యాధునిక శైలీపరిమళముల వెదజల్లుచుండుట విశేషము.

రచయిత యీ గ్రంథమును రచింపబూనునాటికి పద్యరచనలో నవీనత యింతగ నెలకొనలేదు. కోమలపద పారిజాతములకూర్పు - మధుర మందార మకరందధారా ప్రసార సదృశ భావోద్ధతి - అర్చావతార పరిభావకవితావాహిని యందంతర్వాహినులుగ బ్రవహించుచున్నవి.

సమకాలీన పద్యరచనా పద్ధతికి భిన్నమైన వైఖరిలో - ఇంతమార్దవమును; సొగసును; మంజులతను; రంజకతను కవితలో బ్రస్ఫురింపజేయుగల్గుట - కవియొక్క విలక్షణ మనోహార సలక్షణ సహజకవితా లక్షణమునకు దార్కాణము.

వరశేఖనసమానీంద్రుడు
సురుచిరముగ నుద్భవిల్లె శోభితుడగుచున్
సురలెల్ల బుష్పవృష్టిని
గురియించిరి ఋషులకెల్ల కోరికలలరన్

ఇభవరదు! సుప్రతిష్ఠా
విభవము వినినంత నాకు వేడ్కమనమునన్
బ్రిభవించె నింక దెల్పవె!
శుభకరమగు తచ్చరిత్ర సుగుణాగరిష్ఠా!

మొదలయిన పద్యముల గొన్నింటిని మచ్చుతునకలుగ జూపినను గ్రంథమునందంతట నిట్టి కవితయే సౌరభముల గుబాళించుచున్నది. కవిగారికి - అంత్యానుప్రాసలపై మంచి యధికారముగలదు.

శరధిసుతాలయవక్షా!
పురుహూతాద్యమరరక్ష! భువనాధ్యక్షా!
కరిరాజవరదదక్షా!
నిరుపమకరుణాకటాక్ష! నీరేజాక్షా!

శ్రీరమణీహృదయేశ్వర!
నీరదగంభీర! సర్వనిగమాధారా!
కారుణ్యామృతపూరిత
ధీరా! బాపట్లవాస! దివ్యవిలాసా!

ప్రౌఢశైలిలో కవిత నల్లగలశక్తియు రచయితకుగలదని నిరూపించుటకీక్రింది యుదాహరణమును బేర్కొనవచ్చును.

"చండప్రస్ఫుటబాహుదండ ఘనరక్షశ్శిక్షణోద్దండ బ్రహ్మాండాంతఃప్రతిభాస భాసురశుభానందైకరూపావహో
ద్దండప్రక్రియమూలకారణవిశుద్ధాత్మా! ప్లుతాత్మా! శాశ్వతా!
చండాంశుప్రతిభ ప్రకాశజగదీశా! భావనారాయణా॥"

గ్రంథకర్తగారి వచన రచనయు ప్రశంసనీయ సరళిలో నడచినది.

శ్రీ విఖనసాచార్యస్వామివారి ప్రాదుర్భావమును గురించి - అర్చావతార వైభవమును గురించి ఉత్సవవిశేషములను గురించి యిట్టిమధురపాకమున గ్రంథరచన గావించిన కీర్తనీయులు కీర్తిశేషులు శ్రీమాన్ నల్లూరి రంగాచార్య స్వామివారు ధన్యతములు పూజ్యచరణులు - శ్రీ భావదేవ దివ్యానుగ్రహపాత్రులు.

ఈ కృతిని పునర్ముద్రణ మొనర్పనుద్యుక్తులయిన గౌతమ సోదరులు సంకల్పసిద్ధులు.

శ్రీ మదర్చావతార ప్రభావము

బాపట్ల పురనివాసున
కాపద్బాంధవున కన్యయానందునకున్
పాపౌఘభంజనునకును
దీపితగాత్రునకు భావదేవేశునకున్.

సభక్తికముగ నంకితమీయబడి నల్లూరి వంశమున కజరామరకీర్తిని ఘటించినది.

శుభమ్

“జయన్తితే సుకృతినోరస సిద్ధాః కవీశ్వరాః”

ఓమ్

శ్రీరస్తు　　　శ్రీయైనమః　　　శుభమస్తు

    

## -: శ్రీ మదర్చావతార ప్రభావము :-

శ్రీమత్సుందరవల్లి రాజ్యరమతో శృంగారవేషమ్ముతో నామోదంబున భక్తరక్షణకు తానర్చాస్వరూపంబు సత్ప్రేమం దాల్చి విశేషవైభవము శోభిల్లంగ బాపట్ల సద్ధాముండౌ వర భావదేవుని మదిన్ ధ్యానింతు నశ్రాంతమున్.

కలుషము లెప్పుడు శంకర కమలసంభ
వాది సురులకు నొసగుచు నవ్యయముగ
మొలకనవ్వులు మోమున గులుకులక్ష్మి
చెలువమలరగ మమ్ము రక్షించుగాత.

ఘనవిఘ్నాంధ దివాకరు
ననఘున్ కరుణాసముద్రు నాశ్రితభద్రున్
ఘనవిష్వక్సేనుని మది
ననయత స్మరియింతు కావ్యచతురతగలుగన్.

ననియతి నాగమశాస్త్రం
బును విరచించియు స్వసూత్రిమున కాధ్యుండౌ
ఘనుడగు విఖనసమునివరు
మనమున నేసంస్మరింతు మరువక నెపుడున్.

మది వాల్మీకి మహర్షిని
సదమలమతు లాంధ్రకవుల సన్నుతిజేతున్
బెదరక కుకవుల నెల్లను
వదలక నిరసింతు కావ్యవంచకులగుటన్.

ఆర్యులు వోగడ నృసింహా
చార్యులు తత్పోషకుండు సన్మతి రామా
చార్యులు సత్పండితు లా
దార్యుల గురువులను దలతు ధరనగ్రజులన్.

వ- అని యిట్లు విధంబున నిష్టదేవతానమస్కారణంబును సుకవి పురస్కారణంబును కుకవితిరస్కారణంబును గావించి,

శ్రీవైఖానస సత్కులార్ణవశరత్కీర్త్యాంశుడు ద్య ద్య శః ప్రావీణ్యుండు హరిప్రియార్చనుడు దుష్పాపౌఘదూరుండు నా నావేదస్మృతిశాస్త్రకోవిదుడు శ్రీనల్లూరి వంశంబునం దావిర్భావముజెందె మున్ను నరసింహాచార్యనామంబునన్.

ఆఘనునకు బుత్రుడై జనించెను తిరు
వేంగళాచార్యు లనంగ భువిని
బాలచంద్రునిరీతి బ్రబలుచు శాస్త్రార్థ
సార సంగ్రహముల చతురుడగుచు
నరసమాంబయనెడి నారీమణిని బెండ్లి
యాడి సుఖంబుల ననుభవించి
అగణితకీర్తిచే నతిశయిల్లుచు మది
బాయకధర్మముల్ బరగజేసి

భాసిలుచుతాను వాసిగ వాసిరెడ్డి
వేంకటాద్రిప్రభువు చేత విభవములను
సాటిలేనట్లుగానొంది సకలజనుల
పాలిటికి కల్పభూజమై పరిఢవిల్లె.

ఆయనకు సుతుడు వేంక
ట్రాయాచార్యులు జనించి రాజిల్లుచు న
త్యాయతపండితకవిత సు
ధీయుతుడై జగతిబరగ స్థిరతరకీర్తిన్.

సతులలోపల బతివ్రతయు మిక్కిలిగుణ
సతియు సంతతధర్మమతియు సుజన
హితచరిత్రయు భాగ్యవతియు స్వాంతమున శ్రీ
పతి నేమరకయుండు సద్వతియైన
సతిజానకమ్మను హితమతి బెండ్లాడి
యతులసౌఖ్యంబుల నతిశయిల్లి
సుతునిగాంచిరి నన్ను సుజనులు పొగడంగ
ఘనత రంగాచార్యులనెడి వాని
నిపుడు శ్రీభావదేవ నీకృపలభింప
నమ్మి నేనీ ప్రబంధంబు నయతజెప్పి
నీకునర్పణజేసెద నేర్పుతోడ
దీని గైకొమ్ము మునిహిత దివ్యచరిత.

## షష్ట్యంతములు.

ఏసంసిద్ధగుణానిధికిని
సేవకనుతచరిత సతతచిన్మయవిధికిన్
భావైకబోధ పధికిని
లావణ్యరసాంబుధికిని లక్ష్మీపతికిన్.

రామునకు సకలజగదభి
రామునకు సమస్తభవవిరామునకు ఘన
శ్యామునకు మహానిమానస
ధామునకు రమామణీహృదయరమ్యునకున్.

బృందారకవందితున క
మందానందైకభావనాతీతునకున్
సుందరదేహునకును ఘన
మందరనగధీరునకు రమారమణునకున్.

బాపట్లపురనివాసున
కాపద్బాంధవున కవ్యయానందునకున్
పాపౌఘభంజనునకును
దీపితగాత్రునకు భావదేవేశునకున్.

వ- సమర్పితంబుగా నాయొనర్పంబూనిన అర్చావతార ప్రభావంబను మహాప్రబంధమునకు కథావిధానం బెట్టిదనిన,

## —: క థా ప్రా ర ం భ ము :—

నారదుడొకనాడు నలువసన్నిధికేగి
ప్రణుతుడై కోర్కచే బలికెనిట్లు
ఆదినారాయణు డర్చాస్వరూపంబు
గైకొనుటకు నేమికారణంబు ?
తచ్చరిత్రము నాకు దగదెల్పు మనవుడు
వినువత్స ! జెప్పెద వేడ్కతోడ
నామహాత్మ్యచరిత్ర మద్భుతంబై యొప్పు
దెలియజెప్పెదనీకు తేటపడగ

నిశ్చలంబుగ జిత్తమునిల్పి భక్తి
తోడనీకథ వినినను దోషహారము
జ్ఞానవైరాగ్యసంపద గలుగుననుచు
జెప్పబూనెను నారదుచిత్తమలర.

సర్వలోకములకు కీడు సంభవింప
మానిజనములు విబుధులు మదిని భీతి
నొందినను గాంచి మ్రొక్కుచు నోమహాత్మ !
బౌద్ధపాషండమతములు ప్రబలెభువిని.

పరమాత్ముని మదిదలచక
నిరతము కుటిలస్వభావనిర్ణయులగుచున్
వెరువక ధర్మము సత్యము
లరయగ విడనాడి దుర్మదాంధులరగుచున్.

కరుణ యొకించుక లేకయు
దురితాంబుధిలోన మునిగి దుర్ణయులగుచున్
నరులిటు వర్తించుటచే
ధరదుర్భిక్షంబునొదవె దానమహాత్మా!

అనుచు సుపర్వాణులు వర
మునిసంఘము బలుక ఏను బుద్ధినియటయో
చన జేసి దీనిదీర్పగ
వనజాక్షుసుదక్క నితర వారలకగునే!

వ- అని మనంబున వితర్కించి ఏకాంతప్రదేశంబునకున్ జని నిర్మలచిత్తుండనై యటకుశాజినంబులన్ జేసిన స్వస్తిక ప్రముఖాసనంబునన్ గూర్చుండి యమ నియమ ప్రాణాయామ ప్రత్యాహారధ్యాన ధారణ సమాధినిష్ఠలచే రేచక పూరక కుంభక త్రివృత్ప్రాణాయామంబున ప్రాణేంద్రియ మనోబుద్ధిచిత్తంబుల నేకాగ్రింబుజేసి ప్రణవార్థప్రతిపాదకుడును, "నిష్కళంక నిరంజన నిర్వికల్ప నిరాఖ్యాత శ్శుద్ధో దేవ ఏకో నారాయణః" అనెడు నారాయణోపనిషద్వాక్యార్థ సారవిచారణీయుండును "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ" అనెడు శృత్యర్థము ననుసరించి అవాఙ్మానసగోచరుండును వేదాంతవేద్యుండును నగు శ్రీమన్నారాయణుని బురుషసూక్తవిధానంబునన్ ధ్యానంబొనరింప నాభక్తవత్సలుండు"

